Reg. No. 757.

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.


సంపుటము 9 } 1917సం॥ మార్చి { సంచిక 3


[illegible]

1. మిత్రస్తుతి.
2. శివప్రతిష్ఠ. [illegible] ధిపతి.
3. స్వర్ణకారవ్యవహారము.
4. శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్ర-రాయవరపు గవర్రాజు;
5. వర్ణవ్యవస్థ } శివపురపు వీరభద్రపాకయాజి చిఱుకుల అప్పయ్యశాస్త్రి.
6. సూతసంహిత-కొప్పరాజు నరసింగయ్య.

చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0


చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur, and published at Janapadu, by the Editor Ashtavadhani Janapati Pattabhirama Sastry.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

2 రాజా బెల్లపురవలరాఘవేంద్రరావు బహద్దూర్, జాగిరిదారుగారు, నవాబుపేట.

## పోషకులు.

1 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజిమునసబు, నిడుబ్రోలు.

2 రాజా నారయప్పారావు సింహాద్రప్పారావు బహదరు

3 రామసింగుగారు నెల్లూట్ల షాపురపు సంస్థానముమేనేజరు, నెల్లూట్ల.

5 రాజా నాసిరెడ్డిచంద్రిమౌళీశ్వరప్రసాదు బహదరుమన్నెసుల్తాన్

6 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి.

8 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చోళ్లేరు.

9 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట.

## సహాయులు.

1 తంగెడ నరసింహారావుగారు, [illegible] జలంపాడు.

2 చివుకుల అప్పయ్యశాస్త్రిగారు, సికిందారాబాదా

8 వెలుగూరి పిచ్చయ్యగారు కొదమగుండ్ల

4 కానుమాను హనుమయ్యగారు నర్సారావుపేట.

5 బాకరాజా పరాంకుశరావు దేశముఖుగారు, యాడవరము.

6 పిల్లలమర్రి సోమయాజులుగారు, తహాసీలుదారు నరసారావుపేట.

7 మల్లాది కామయ్యగారు, చింతపల్లిదొరసాని సంస్థానం గుంటూరు.

8 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి.

9 మెదకు శేషారావు దేశముఖుగారు, వల్లబల్లి.

10 హేబీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిల్ల.

11 నరసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.

12 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి.

18 తూము నరసింహారావుగారు కట్టెంపూడి

14 ఉప్పుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమీదీపురం

15 ఉల్లగంటివీరరాఘవరావుగారు, ముక్తాదారు. ఆనేపురం

16 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి.

17 తోర్లకొండ హనుమంతరెడ్డిగారు గోలంవగైరా సేగ్దారు, యల్లారెడ్డిపల్లె

18 శివపురపు వీరభద్రపాకయాజిగారు, సికింద్రాబాదా.

19 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీలుదారు జగిత్యాల.

20 రాయవరపు గవర్రాజుగారు, మూలపేట.

21 జూలూరి వెంకటరత్నంగారు వకీలు, గుంటూరు.

# మిత్ర స్మృతి

గుంటూరుసీమ-పూర్వరంగము 69 వపుట.

చ॥ అతిని నుతింపఁగావలదె యక్కట శాఖకు నిట్టు లెందఱో
వితగఁ బ్రయత్నముల్ సలుపువేళ యథార్థము పత్రికన్ సమం
చితగతి వ్రాసి యిందఱకు సిగ్గు ఘటిల్లఁగఁ జేసి సర్వస
మ్మతమగు త్రోవఁ ద్రొక్కె బుధమాన్యతగన్న సుదర్శినీశ్వరున్॥

ఉ॥ సాహస మెంతచేసెనో యసాధ్యు డతండు స్వశాఖవారుని
ర్వ్యాహకులై మహామహులు బ్రమ్మని దిమ్మగ దిమ్మ బ్రమ్మగా
ద్రోహదమాచరించునెడ "ద్రోహముకూడదు త"ప్పటంచు సం
దేహమువీడి వ్రాసెఁ దన తెంపు బుధుల్ వినుతింపుచుండఁగన్॥

ఉ॥ పక్షముఁబూని వ్రాయు తమబంధుల వ్రాఁతలనెల్లఁ బూర్తిగా
శిక్షయొనర్పఁజాలెడి విశేషములం బ్రకటించి పత్రికా
ధ్యక్షుత సార్థకంబుగ యథార్థముఁబట్టి చరించినట్టి యీ
యక్షయసూనృతాత్మునకు నంజలిసేసిన నబ్బుఁ బుణ్యముల్॥

ఉ॥ సత్యము వ్రాయఁ డొక్కరుఁడు శాఖకులోఁగుటఁ జేసి పత్రికల్
దౌత్యముసేయఁగాఁ దొడఁగె దారినిదప్పి యిదేమి! యెంతదౌ
ర్గత్యముదాపరించెఁ గలికాలమహాత్త్వముఁబట్టి యంచొగిన్
నిత్యము చింతసేయునెడ నీతికి నీతఁడు నిల్చె నొక్కఁడున్॥

క॥ కల రెందఱేని లోలో
పల నిది యన్యాయమనుచుఁ బలుకు నియోగుల్
ఫలమేమి పలుకిరారొగిఁ
జెలఁగి పలుకివచ్చె నొక్క శివశంకరుఁడే॥

సీ॥ కస్తూరియను సమాఖ్య వహించినట్టి యీ
తని యింటికిఁ బ్రశస్తి తనరుఁగాక
"శివశంక"రాభిఖ్యచే నెసంగెడి యీతఁ
డనుపమ ప్రఖ్యాతినందుఁగాక
తనపేరు సార్థకత్వముదాల్ప నితని ప
త్రిక "సుదర్శిని" పేరు దెచ్చుఁగాక

త్రికరణశుద్ధిగా దేవుఁడుండుట యెఱిం
గిన యీతని మనంబు మనెడుఁగాక
ఇతనిఁవ్రాఁత యాచంద్రార్క మెల్లబుధుల
మెచ్చునకుఁ బాత్రమై పొరపొచ్చెములను
బెట్టి వ్రాయువ్రాఁతల చెంపపెట్టుగా ను
దాహరించెద మంబ ప్రత్యక్షరంబు॥

అని తిరుపతి వెంకటేశ్వరులంతటి ధీరకవీంద్రులచేతనే పేరుకొనఁబడిన సుదర్శనీపత్రికాధిపతి కస్తూరి శివశంకరకవి కాలధర్మమునొందెనని తెల్పుటకుఁ గడువిషాదముఁ గాంచుచున్నవారము.

తే॥ అకట! కస్తూరి శివశంకరాఖ్యసుకవి!
ఎంతలో మాయచావు నీ కేగుదెంచె
మొన్న కేకద నన్నుఁగూర్చి యెన్నో జాబు
లనిపితివి పుత్రశోకంబు నపనయింప॥

క॥ నానందనుఁడై కుండఁగ। నీనుడియొకకొంత దేర్చెనీతిదమాటల్
నినిధనమునంగల్గిన। మానసదుఃఖంబునేరు మాన్పంగలరో

ఉ॥ పత్రికలెన్నియోకల వపాత్రములై ధర వర్ణసంకర
స్తోత్రపరాయణత్వమున సువ్రత! ధర్మరతిన్ యథార్థపుం
జిత్రచరిత్ర దుర్మతుల చెంపలుపిండుచు నన్యపత్రికా
జైత్రతనొప్పఁగల్గినది సత్యముగన్ భవదీయ మొక్కటే॥

—(•)—

## చింతిరాలశివప్రతిష్ఠ.

క॥ శ్రీయును శ్రీ రాణింపఁగఁ
జేయు మహౌదార్యముం బ్రసిద్ధియునన్ దీ
ర్ఘాయువునుం గూర్చుత శివ
రాయఁడు మా రాల్లభండిరాజయ కెపుడున్॥

సీ॥ చింతిరాల సమాఖ్యఁ జెలఁగుసూరి శివుండు
కొత్వాల్ పటేలయి కొమరుమిగిలె

తనయేలుబడిలోని తత్థ్సలంబులను నె
వ్వనిది సుగ్రీవాజ్ఞయనఁ దనర్చె
తన విక్రమరుతారధార నెవ్వఁడు ద్విష
త్తతిమహాటవిని ఖండితమొనర్చె
నజఘునౌదార్యసంచిత యద్యశోరాశి
విద్వత్ప్రశంస్యమై వెలసియుండె
అట్టి శ్రీరాల్లి ఖండ్యన్వయాబ్జతరణి
రాజయాహ్వయుచేఁ జింతిరాలలోన
నలశర త్ర్యగ్నినమ్మునఁ దొలుతటిదగు
ద్వాదశిని జేయఁబడియె శివప్రతిష్ఠ

శా॥ ప్రాచీనంబగు తచ్ఛివాలయము జీర్ణంబైనఁ దత్క్షేత్రముల్
వే చేర్పంబడి సేరిలోన వరుసన్ వేలాన కుత్తర్వురా
నేచిత్రంబా యొనర్చి రద్దుపడులా గేర్పాటుగావించి స్వీ
యాచిత్యంబునఁ జేసె నీఘనుఁడు దానర్థిం దదుద్ధారమున్॥

శా॥ మూఁడాబోతులు విద్వఁగాఁబడుట నీ మూక్కంటెనిన్ నిల్పుచో
జూడన్ వచ్చుడు వేలసంఖ్యజన మాచోద్యంబు సంప్రీతిమై
వాఁ డున్ వీఁడు ననాక యెల్లరులకున్ వందించి శాల్యన్న మెం
తో డంబంబుగ నర్థరాత్రి వఱకుం దోడించి పెట్టించెఁ గా

మ॥ సకుటుంబంబుగ నేగుదెండనుచుఁ దా సంప్రార్థనల్సేసి వే
డుక విద్వాంసుల నీప్రతిష్ఠకొఱకై తోడ్తెచ్చి కార్యాంతమం
దకలంకస్థితి నింటిపెండిభులక ట్లర్హంపు సత్కారముల్
ప్రకటించెంగద యీఘనుండు సుకవుల్ పల్మాఱు వర్ణింపఁగన్॥

ఆ॥ బహుసహస్రసంఖ్యబ్రాహ్మణసంతర్ప
ణంబొనర్చు బాచినప్పరామ
కృష్ణయాభిధానకృతి కులగురుఁడుగా
నిట్టికార్యములకి కేమి కొదవ

క॥ పండిత సన్మాననము న
ఖండంబౌ నన్నదానకరణము మొదలౌ
దండిపనులు సలుపుట యటు
లుండఁగఁ గరమెన్నఁదగిన దొకటుండె నికన్

మ॥ పిలువంగాఁబడి తత్ప్రతిష్ఠకనుగోఁ బ్రేమించి యేతెంచు ని
ష్టులు దుష్టాపహృతస్వభూషలగుచున్ శోకింపకుండంగ వా
రలు చేయించి రయంబ వాని మరలన్ రమ్యంబుగం బెట్టి యా
వలఁబంపించిన యయ్యుదారుగుణముల్ వర్ణింపఁగం జెల్లదే॥

సీ॥ ఫాల్గునమాసానఁ బార్వతీశుప్రతిష్ఠ
సైయనన్నెల్లరున్ సలిపినాఁడు
శ్రావణమాసాన స్వవివాహకార్యంబు
ప్రకటపద్ధతిని జేసికొనినాఁడు
వైశాఖమాసాన వాసిమైఁ దనతమ్ముఁ
డౌ సుదర్శను పెండ్లి చేసినాఁడు
పండ్రెండుమాసాలఁ బండితప్రతతికి
సరిగ వర్షాశనాల్ జరిపినాఁడు
ఒక్కవత్సరమున నిన్ని యుత్తమంపుఁ
గార్యములఁ జేసియున్న యీయార్యజనుఁడు
స్వప్రతిష్ఠితుఁడై యున్న శంకరుదయ
నింతకినుమిక్కిలిగ భాగ్య మొనసి మనుత॥

—(*)—

యమే యేర్పఱచినయెడల నట్టియోగ్యతలుగలిగియున్న మనుష్యులను బ్రాహ్మణులని పిలిచినట్లుగానే విశ్వబ్రాహ్మణులనిపిలిచినను బిలువవచ్చును, కంసాలులనిపిలిచినను బిలువవచ్చును. గులాబిపువ్వు నే పేరుచే వాడినను వాడవచ్చునుగాని యది యట్టిసువాసనమాత్రమే కలిగియుండవలె.

(15) వాదిపక్షమునఁ బ్రథమసాక్షిగా విచారింపఁబడినపండితుఁడు (పల్లాది రామకృష్ణసోమయాజులుగారు) షట్కర్మలుచేయువారే బ్రాహ్మణులనిచెప్పనుగాని యవి యెవరుచేసినను వారు బ్రాహ్మణులగుదురనిమాత్ర మొప్పుకొనఁడు. ఆయన బ్రాహ్మణశబ్దమున కర్థము లోకులచేత బ్రాహ్మణుఁడని యెంచఁబడుచు నట్లు పిలువఁబడువాఁడని చెప్పుచున్నవాఁడు. కర్మ లేవియుఁ జేయకపోయినప్పటికి బ్రాహ్మణసంతతివాఁడైనచో నతఁడుగూడ బ్రాహ్మణుఁడే యనియుఁ జెప్పెడిని. ఆయర్థము ప్రకృతము మేము బ్రాహ్మణులమని గంతులువేయువారి కుపకరింపవలెనను నుద్దేశముతోఁ జెప్పఁబడినదికాని సరియైనదికాదు. వాస్తవార్థప్రకారముండవలసిన విధ్యుక్తములకు లోపముదెచ్చుచున్నయది. వాస్తవార్థము విచారించిన నందులకు నిరంకుశములును సంపూర్ణములును నగు కొన్ని గుణము లవసరమైయున్నవి. అవి యొకమనుజునియొక్కగాని యొకసంఘముయొక్కగాని యభిప్రాయమునో లేక స్వేచ్ఛనో యనుసరించినవిమాత్రము కావు. ఒకవలయాకారమును వారివారిపనులనిమిత్త మెంతమంది చతురపుబొమ్మయనిచెప్పినను నట్లు కానేరదు. బ్రాహ్మణశబ్దముయొక్క నిజమైనయర్థముపోయి ప్రకృత మొకసంఘము వారిని తెలియఁజేయుట కుపయోగింపఁబడుచుండవచ్చును. కాని జనసంఘముయొక్క పరమార్థసాధనమునకొకవిగ్రహాకృతితోఁ జేయఁబడిన యచేతనపురాతిలోపలికి దేవత నావాహనించి ప్రాణప్రతిష్ఠచేయుటకుఁ దగినయధికారమును యోగ్యతయుఁ గలమనుష్యుల నిర్ధారణచేయుటవిషయమైన శ్రమమును దగ్గించుటకు సహాయకారికాదు.

(16) బ్రాహ్మణులు సృష్టికర్తయొక్క నోటినుండియు నితరులితరావయవములనుండియుఁ బుట్టినారనిచెప్పు హైందవపురాణములలోనికి దిగుట నాకనవసరముగఁ దోచుచున్నది. వాదితరఫు 2వసాక్షి (శిష్టా సీతారామశాస్త్రి) కృతయుగములో స్త్రీలు లేరనియు మనుష్యులందఱు నొక్కటేజాతివారనియుఁ దెల్లనిదేహములుగలవారనియుఁ గొన్ని గ్రంథములలోనుండినట్లు చెప్పుచున్నాఁడు.

* తే॥ సత్యశీలాదిగుణముల చయముతోనె
బ్రాహ్మణత్వంబుసాధింపఁ బాటుపడెడి
తీరుపరికి లభించెఁబో భారతమున
నుండు నజగరోపాఖ్యానమొండు దుదకు॥ 15

చ॥ అజగరరూపుఁడైన నహుషోపాఖ్యానిగూర్చి ధర్మజుండు మరి

---

ఆయనచెప్పినట్లు త్రేతాయుగములోనే జాతులేర్పడిన స్పష్టాది నవి యారంభింపఁబడియుండవు. కృతయుగములోఁ గర్మలతో నవసరములేక ప్రతిమనుష్యుఁడును దేవుని భక్తిశ్రద్ధలతోఁ బూజసేయుట సామాన్యధర్మమై యట్లు ప్రతివానిచేతను జేయఁబడుచున్నయెడల నట్టిసంఘము మరల హీనజాతులలోకివచ్చుటకుఁ గారణము లేదు. అసలుగునత యాత్మనుబట్టి యుండునని యెవఁడు ప్రార్థనవల్ల నోరు చెవులు లేని రాయిని ప్రాణముగలదానినిగాఁజేసి మనుష్యులకు వరములిచ్చులాగొనరించునో వాఁడు మాంసము నెముకలతో నిర్మింపఁబడిన తనతండ్రికన్న నేదియో విశేషముకలిగి యుండవలెననియు జనులు వాదుకొందురు. వాదిపక్షపు 3వ సాక్షి (చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు) అందఱును మొదట శూద్రులై క్రమముగా వైశ్యులుగను క్షత్రియులుగను బ్రాహ్మణులుగను మాఱిరని కొన్నిగ్రంథములలోనుండినట్లు చెప్పెడిని. వాది తనపండితసాక్ష్యమునకుఁ దా బద్ధుఁడై యుండవలయును. శూద్రకులమునుండి బ్రాహ్మణకులమునకుఁ బ్రమోషనగుట కాధ్యాత్మికమార్గమున నడచుకొనుచు నంతటితోనే తృప్తిచెందక యుండవలయును.

* మహాభారతము వనపర్వములో సత్యము దానము క్షమ శీలము తపస్సు దయ మొదలగు గుణము లెవనికిఁగలిగియుండునో వాఁడు బ్రాహ్మణుఁడని చెప్పఁబడియున్నది. "ఈగుణములు శూద్రునియం దుండవా" యని యజగరుఁడు ధర్మరాజు నడుగఁగా "నటువంటిశూద్రుఁడు శూద్రుఁడుగాక బ్రాహ్మణుఁడే" యగుననియు "నాగుణములులేనివాఁడు శూద్రుఁ" డనియు నాయన యుత్తరముచెప్పెను. "కులముతో నవసరమే లేదనియు గుణమే కావలసినదనియుఁ దెలివిగలవారు చెప్పుదు" రని ధర్మరాజు వ్రాసియున్నవాఁడు.

"నిజమును శాంతి మున్నగు ననింద్యగుణంబులుగల్గువాఁడెయు
ద్విజుఁ"డని చెప్పియుండె ననిక మనమున నిభృగాను భారతం
బుఁ జదివి తా గ్రహించినది బుద్ధిసుసూక్ష్మత వెల్లడింపుచున్॥ 16
తే॥ "సుగుణసంపత్తిగలిగిన శూద్రజనుఁడు
బ్రాహ్మణసమానుఁడంచును బ్రాహ్మణుండు
సుగుణసంపద లేకున్న శూద్రసముఁ" డ
టంచునేకాని తద్భావ మన్యమగునె॥ 17
క॥ సత్యాదికసద్గుణములు। నిత్యానుష్ఠానబుద్ధి నెగడఁగఁ బ్రజకున్
సత్యరతుఁడైన ధర్మజుఁ డత్యుక్తిగఁ దావచించె నటునహుషునితోన్
క॥ దేనికి శ్రైష్ఠ్యంబీయఁగ। మానసమున నెంతొ బుధులు మఱిమఱి దానిన్
బూనినుతియింత్రు కానీ। దానియవశ్యాచరణమె తన్మతమచటన్॥ 19
(1) క॥ సవనమున వపాహోమం। బవశ్యకరణీయమనుటకై "యాదివిజ
ప్రవరుండుగుండౌజీలిచి। యవితథతను గ్రవేల్చె"నన దెయామ్నాయంబున్
(2) తే॥ "ఎవఁడు పుండరీకాక్షుఁదా నెద స్మరించు
వాఁడు బహిరంతరంబుల వరలుశుచిత"
ననుచు స్మృతివాక్యముండినయంత మాత్ర
నితరశౌచంబు మాన్పనే యిలజనంబు॥ 21
తే॥ పుండరీకాక్షు జను లెదం బూజసేయ
నచట నెటుచెప్పిరో మును లతిశయోక్తి
సత్యశీలాదివృత్తంబు జనులుపూన
ధర్మజుం డట్టు లత్యుక్తి తావచించె॥ 22
ఉ॥ అంతియెకాని శూద్రజనుఁడా సుగుణంబులు గల్గినంతనే

---

(1) వేదాంతపరిభాష, ఆగమపరిచ్ఛేదము, యోగ్యతానిరూపణము
శ్రు॥ "స ప్రజాపతి రాత్మనోవపా ముదఖిదత్" యిత్యాదావపి తాత్పర్యవిష
యీభూత తూబర (శృంగహీన) పశుప్రాశస్త్యబాధో యోగ్యతా.

(2) స్మృతి॥ శ్లో॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా
యస్స్మరే త్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరశ్శుచిః

వింతగ బ్రాహ్మణుండగుచు వెల్గెడినంచనికాని బ్రాహ్మణుం
డంతటిలోనె శూద్రజనుఁ డయ్యెడునంచనికాని తేల దా
యంతకసూనుభావ మటుపైఁగలశ్లోకములం బఠించినన్ 23
(1) నా నిసిభుజగాగ్రహించినటు మున్నహుషుండు గ్రహించి శంకతోఁ
చిన మది ధర్మజుంగుఱిచి చేసెను ప్రశ్నము "ధర్మరాజ! నీ
వనినవిధాన బ్రాహ్మణతయున్నది వృత్తమునుండియే లక్షిం
చిన వృథగాఁగ జాతుల సృజించినదెందుల కింక" నాపుడున్ 24
కం॥ అతిసూక్ష్మశాస్త్రవిషయ ప్రతిపాదనపూర్వకముగఁ బాండుధర్మరా
ట్సుతుఁడు వచించెను మద్భాషితములకెమహోపయుక్తి సేసెడిరీతిన్ 25
(2) "సకలజాతులపురుషుల సంగమమున । సకలజాతుల స్త్రీలును
సంతుగనుడు । వర్ణసంకర మైపోయె వసుధ గాన
జాతి దుర్జ్ఞేయమని యార్య! నాతలంపు 26
(3) మహిని వాగాదికములట్లు మైథునమును సర్వసాధారణంబయ్యె పర్వి
యుండ నెపుడుఁగామాంధమైయుండు నీజనంబు సులభసాధ్యంపుఁ
బని కేలచొరకయుండు 27
(4) ఇచట "యేయజామహే" యను శ్రుతివాక్య
మగుఁ దగుప్రమాణ మహికులేంద్ర!

---

(1) మహాభారతము

అరణ్యపర్వాంతర్గ తాజగరపర్వము - అశీత్యధికశతతమాధ్యాయము

సర్పఉవాచ - శ్లో॥ యది తే వృత్తతో రాజన్! బ్రాహ్మణః ప్రసమీక్షితః। వృథా జాతి స్తదాయుష్మన్! కృతి ర్యావ న్న విద్యతే॥

(2) యుధిష్ఠిర ఉవాచ - శ్లో॥ జాతిరత్ర మహాసర్ప! మనుష్యత్వే మహామతే! సంకరా త్సర్వవర్ణానాం దుష్పరీక్ష్యేతి మే మతిః॥ సర్వే సర్వా స్వపత్యాని జనయంతి సదా నరాః॥

(3) శ్లో॥ వాఙ్మైథున మథో జన్మ మరణంచ సమం నృణాం॥ వ్యాఖ్య - వాగాదీనామివ మైథునస్యాపి సాధారణ్యాత్ జాతి ర్దుర్జ్ఞేయా - తథాచ శ్రుతిః "న చైతద్విద్మో బ్రాహ్మణాస్స్మో వయ మబ్రాహ్మణావా" ఇతి బ్రాహ్మణ్యే సంశయ ముపన్యస్యతి.

(4) శ్లో॥ ఇద మార్షం ప్రమాణంచ యేయజామహ ఇత్యపి॥ వ్యా॥ నను జాత్యనిశ్చయే

సవనములను హోతృజనముచే నయ్యది
యుచ్చరింపఁబడుచు నుండు నెపుడు॥ 28

క॥ ఏమేము బ్రాహ్మణులమైనా మో లేకన్యులమయినా మొయరయుచో
నామేము యజించుచున్నా ”మనుచుఁ దదర్థమగును నాగకులేంద్రా

క॥ యజమానులయిన జనములు
నిజజననంబెవరివలన నెగడినయదియుఁ
నిజమెఱుఁగక యీమంత్రం
బుఁజెవి హోమము సేయఁబూనుదు రచటన్॥ 30

(1) ఆ॥ కాన బ్రాహ్మ్యగతమునకు ముశీలంబరా
దత్త్వదర్శిజనుల తలఁపువలన
మనువుమాత్ర మన్యమును వచియించె నీ
విషయమందు వినుము విషధరేంద్ర!॥ 31

(2) ఆ॥ “జననమందుఁ బొడము సకలవిఘ్నంబులో
దోసఁగులెల్ల నవలఁ దొలఁగిపోవ
జాతకర్మ మనుచు సరవి నాభిచ్ఛేద
మునకుఁ బూర్వ మొకటి యొనరుపనగు॥ 32

(3) క॥ సావిత్రీనామకయా
దేవతనే తల్లిగాఁగఁ దెలియఁగఁదగు న
ష్టావిధముగ నాచార్యుగ
భావనచేసికొనవలయుఁ బదపడి తండ్రిన్ 33

---

కథం బ్రాహ్మణోహ మిత్యా ద్యభిమానపురస్సరం యాగాదౌ ప్రవర్తతే త్యాశంక్యాహ, ఇదమార్ష మితి॥ అత్ర “యేయజామహే” ఇత్యనేనచ “యే వయం స్మో బ్రాహ్మణాః అన్యేవా తే వయం యజామహే” ఇతి బ్రాహ్మణ్యే అనవధారణం దర్శితం మంత్రలింగమపి “ యఏవాస్మి ససన్ యజే ” ఇతి......

(1) శ్లో॥ తస్మాచ్ఛీలం ప్రధానేష్టం విదు ర్యే తత్త్వదర్శినః॥

(2) శ్లో॥ ప్రాఙ్నాభివర్ధనా త్పుంసో జాతకర్మ విధీయతే॥ వ్యా॥ కస్మైత్వ బ్రాహ్మణ్యహేతు రిత్యాహ ప్రాగితి॥ నాభివర్ధనాత్ నాళచ్ఛేదనాత్॥

((3 శ్లో॥ తదాస్యమాతా సావిత్రీ పితా త్వాచార్యఉచ్యతే॥

(1) క॥ ఉపనయనం బగుదాకను
విప్రులన్ శూద్రసముఁడగుచు వెలయును ద్విజుఁడా
యుపనయనం బగుమీఁదనె
జపతపములు మొదలుగాఁగఁ జలుపఁగఁ దగెడిన్ ” ॥ 34

క॥ అని ఈగతిస్వాయంభువ। మనువామ్నాయో క్తకర్మమార్గమె బ్రాహ్మం
బునకు నిదానంబనుచును జనులమనస్సంశయంబుసమయిం చెలలిన్ ॥

తే॥ ఎపుడు వేదో క్తకర్మవిహీనులగుచు బ్రాహ్మణక్షత్రవిట్కులప్రభవులుం
దో అపుడుశూద్రసమానులై యలరఁగల రతత్స్వధర్మపరిత్యాదక్షులెల్ల

(4) తే॥ వేదచోదితమైనట్టి వృత్తియెల్ల
నెచట లోపించి స్వేచ్ఛమై నేగఁబడునొ
అచట బలమైన సాంకర్యమమరియుండె
ననుచు నూహింపగందగు నహికులేంద్ర! ॥

(5) ఉ॥ కాన త్రయీరహస్యము సుఖంబుగఁ దెల్పఁగ నేరుపడ్డ యా
మానవధర్మశాస్త్రమున మంచిగమించ వచించురీతిగన్
దానదయానృశంస్యజప తథ్యపురోగముమైనయట్టిదై
యేను మొదల్ వచించినది యింతకు సంస్కృతవృత్తమయ్యెడున్।

---

(1) శ్లో॥ తావచ్ఛూద్రసమో హ్యేష యావద్వేదేన జాయతే

(2) శ్లో॥ తస్మిన్నేవం మతిద్వైధే మను స్స్వాయంభువోఽబ్రవీత్॥ వ్యా॥ ద్వైధే జాతే సంశయేసతి

(3) శ్లో॥ కృతకృత్యాః పునర్వర్ణా యది వృత్తం నవిద్యతే॥ వ్యా॥ వృత్తం వైదికసంస్కారో యది నవిద్యతే తర్హి సర్వాః ప్రజాః కృతకృత్యాః శూద్రతుల్యాః తథా చస్మృతిః- “నశూద్రే పాతకం కించి న్నచ సంస్కారమర్హ” తీతి తేషాం సంస్కారానర్హత్వ నిష్పాపత్వాభిధానా త్కృతకృత్యత్వం దర్శయతి తద్వత్ త్రైవర్ణికా అపి స్యురిత్యర్థః॥

(4) శ్లో॥ సంకర స్తత్ర నాగేంద్ర! ఒలవాన్ ప్రసమీక్షితః॥ వ్యా॥ అత్ర వృత్తాభావే॥

[5] శ్లో॥ యత్రేదానీం మహాసర్ప! సంస్కృతంవృత్త మిష్యతే। తం బ్రాహ్మణ మహం పూర్వముక్తవాన్ భుజగోత్తమ !

ఆ॥ జాతకర్మముఖ్య సంస్కారములచేత
నెవఁడు శుద్ధుఁడగుచు నెసఁగియుండు
వాని సత్య శీల దానాది వృత్తంబె
సంస్కృతం బటండ్రు క్షమను బుధులు॥ 39

అ॥ అట్లు జాతకర్మమాదిసంస్కారములు। సత్యశీలములును సరిగఁ గల్గి
యుండినట్టివాఁడె యుత్తమబ్రాహ్మణుం। డిదియ యార్య। నాదుహృద్గతంబు॥

క॥ ఆసంస్కారము లెల్లన్। జేసికొనన్ శూద్రునకును జెల్లద యెపుడున్
ఆసంస్కారవిహీనుని। కేసుగుణాలున్నఁ గాఁడయిలవిప్రుఁడుగన్,,

చ॥ అనివచియించెఁ బాండుసుతుఁ, డంతటియర్థముఁ గల్గియున్న వా
ఘనతరభారతోక్తులకుఁ గానివి పోనివి యేవొ వ్రాసి యా
మునిస్సిభుగారు బ్రాహ్మణులయుత్తము చిత్తము నొవ్వఁ జేసినా
రనవసరంపు వ్రాఁతయని యావల జడ్జి రిమార్కుచేయఁగన్॥ 42

సీ॥ ప్రతివాదిపండితు పటిమవీక్షింతమా
వ్యర్థమౌ సాక్ష్యంపుఁ బ్రవచనమున
తన్న్యాయవాదుల ద్రఢిమగన్గొందమా
స్వపక్షకృద్బ్రాహ్మ్య సాధనమున
మధ్యవర్తిమనీషి మహిమ యోజింతమా
స్వప్రియపాండితీ స్థాపనమున
స్వీయమౌ విద్యావిశేషంబు నెంతమా
వర్ణసాంకర్యంపు వాదనమున
ఇట్టిసాధనసంపత్తి పెట్టుకొనియె
అమ్మహాభారతీయ రహస్యములను
ప్రకటనముసేసి ప్రస్తుత బ్రాహ్మణులను
దిగువఁద్రోచిన మున్సిభుం బొగడవలదె॥ 43

కం॥ ప్రాశస్త్యద్యోతనమున। కై శాస్త్రము లర్థవాద మనుస్మృతి సేయన్
లేశంపుజ్ఞానమునను బ్ర। వేశించిరి బ్రాహ్మమతులు పెడవాదములన్॥

ఆ॥ అగ్నిహోత్రతత్పరమానయఃపిండంబు
న టఁగాల్చుఁగాక యగ్నిలాగె
అగ్నిహోత్రతత్పరమానుక్కుముఖ్యందొ్రి
యగ్నిహోత్రిముంద్రోయవనిజనులు॥ 45

క॥ రాజపురోహితుఁడౌజను।రాజుగనే చెప్పికొందు్రిరభసమునఁబ్రిజ
ల్రాజసమానుండౌనో।రాజెయగునో నిజమెఱుఁగరాదోకోమనకుఁ॥

కం॥ ఆవిధసత్యాదికసం।భావితుఁడౌశూద్రిజనుఁడుబ్రాహ్మణసముఁడై
తా వెలయఁజాలుఁగానీ।కేవలబ్రాహ్మణుఁడుగాఁడు క్షితి నెన్నటికిఁ॥ 47

ఆ॥ ఆప్రికారముగనె యవిలేనిబ్రాహ్మణుం
డగును శూద్రితుల్యుఁ డంతెకాని
బ్రాహ్మణుం డనంగఁబడక కేవలశూద్రుఁ
డనఁగఁబడఁడు నిశ్చయంబుగాను॥ 48

సీ॥ ఋతుమతీసతి పెండ్లి శ్రుతిచోదితంబంచుఁ
గోర్కెమైఁ దాఁ జేసికొన్న నాఁడు
విధవా వివాహంబు విధిబోధితంబంచు
సన్నాతిఁ గవగూడి మన్న నాఁడు
జాతిభేదములుంట నీతిగాదని యెల్ల
తెగలవారింగూడి తిన్న నాఁడు
ఉదధియానము సేసి హూణసంఘముతోడ
నుచితంపుగోష్ఠితో నున్న నాఁడు
మఱియు నిటువంటి వేమైన దురితములకు
సాహసంబు నధిష్ఠించి చన్న నాఁడు
వీనికృత్యంబు లెల్లరుఁ విన్న నాఁడు
కాఁడు బ్రాహ్మణుఁ, డందాక కాకపోఁడు॥ 49

కం॥ ఇత్యాద్యత్యంతైనః।కృత్యంబులుభూమిసురునిగ్రిందికిలాగుఁ
నిత్యానుష్ఠితసుతప।స్సత్యాదులుపైకిలాగఁజాలవుశూద్రుఁ 50

తే॥ చెట్టుకొనగొమ్మనుండినయట్టి పండుక్రిందికింబడు నేదేని క్రిందువలన

ఆ॥ ఇట్టికోలము పెంపు నెనయుచు సంజీవ। రాయఁడొప్పె, వీరరాఘవుండు
గాలిపట్టివంటిగట్టిసత్తుగలాఁడు। నెమ్మదైనవాఁడు నేర్పుకాఁడు॥ 39

సీ॥ సత్తుచే వేలుపుంబ త్తిచే నెక్కుడౌ వలపుమోపరిసంతు వంటివాఁడు
ఈవిచే నాయంపుఁ దావిచేఁ బుట్టుచల్వలజోలిజతచూలువంటివాఁడు
నీటుచే బీరంపుఁ బాటుచే నూర్మొనల్చాకుదాల్పరి పట్టివంటివాఁడు
రూపుచే విద్దెలమేపుచే రాకాసి పగవానికొమరునివంటివాఁడు
అసము చేతను దాలిమి మిసిమిచేత
వలపురాసూనుకై సేతవంటివాఁడు
వీరరాఘవుఁబొగడంగ వేయినోళ్లు
గలుగవలెఁగానిలాతులకలవియగునె॥ 40

చ॥ పడఁతినిజంపకున్న నొకప్రాతవిలుం జెగనేసి బీరముల్
నుడువకయున్న నుక్కడిగి నుంకులసీఁతలఁ గానకేగి త
మ్ముఁడుఁ దనుఁ గూడి కోఁతిచెలుము ల్పొనరింపకయున్న సాటిలే
కడరెడువీరరాఘవునకబ్బవికూఁతురుసామి యీడగుఁ॥ 41

సీ॥ మెప్పాల కుబ్బక మిడుకక లేవగల్
పేదవారికి నీరుసాదము నిడు
అలయికఁజెందక చెలులకై వసిఁజూచి
లాతివారికిస్సైత మూఁతనొసఁగు
బందులఁ జెలికాండ్ర బాపన్లఁ దొడుకుల
వేల్పుల నొకరీతి వెలయఁగాంచు
జతగాండ్ర కదనైన జంకొకింతయు లేక
యసురులనైన నీనుజ్జగించు
తబము సెడి పుట్టువునుబొంది తనరెఁగాని
మానిసియె వీరరాఘవమంతిరి యన
మంచిగొనములఁ గీరితిగాంచె సాటి
లేరు పుడమిని నేలాటివా రనంగ॥ 42

సీ॥ ఏకసక్కెమునఁ జొడుబుకుచోటనైన వి
త్తుంపఁబడదె వీని యొఱపుచేత
అంబమే యేఱుంటనైన లేవడిపోవ
నీతనియొఱగు లున్నెని సతము
కడగం డ్లెవరికైన నడఁగకయుండునే
యితనిచూపులగమి యొనసెనేని
వింతసేసెడిచోట్ల నొందునేయిక్కట్టు
లితనిపెద్దఱికంబు నెసఁగెనేని
తగవు లెచటైనఁ దీరక రగులుకొనునె
యితని యొఱుకనుబడెనేని, యెల్లవెఱలుఁ
బాయకుండునె యితనిపే ర్వాకొనంగ
ననుచుఁ బజ వీరరాఘవు ననసి పొగడు॥ 43

క॥ అత్తెఱఁగువీరరాఘవుఁ
డి త్తిగజగములను బెద్దయిల్లాలై తా
నెత్తినది పైఁడిగాదను
బత్తిఁగొలుచు వెంకమయను పడఁతిఁగయికొనెఁ 44

సీ॥ వీరువారని యెగ్గువెదకక యడిగిన
కసర కిచ్చెడిది వెంకమ్మతల్లి
పసిపిల్లలకు నావుపాలుపోయఁగ నింటి
కల్మి నెంచనిది వెంకమ్మతల్లి
ఇరుగువారికి నాయమిడుచోటఁ దనకత్తిఁ
గనకయుండునది వెంకమ్మతల్లి
పెరసంతుఁ దనసంతుఁ బేరపులేకయమన్పు
కఱదగల్గినది వెంకమ్మతల్లి
నగలకైమగని నగలఁ దగులనీని
కఱతలను వన్నెగలది వెంకమ్మతల్లి

నిసువులకు మంచిగోసములు నేర్పుచుండు
కలికితనమును గలది వెంకమ్మతల్లి॥ 45

సీ॥ పుట్టుట పెట్టు ఉప్పాకఁ దిప్పలే బూది
దాల్చువిప్రుఁడిండఁ దగులుకొనియె
నిటుజోరైనఁ జెన్నిటిజోడా నల్ల
వానిపేరెద నెక్క- నానుకొనియె
కనిన వానిన కట్టుకొని పలునోళ్లలోఁ
బహు వెలవెలపాటు వినువకుండె
కడనుండి వెలయాలుగల్గ నిల్వొల్లఁజూ
చుచునుండు మబ్బురాతు చనవొందె
ననుచు మలపట్టి బువిపట్టి నంచరాతు
వెల్లగారురవుతుల యువిదలఁ దెగడి
వెగటు పైచేత పెరవాతఁదెగుట కడను
మెలఁగుటయు లేక వెంకమ్మ చెలఁగుచుండు॥ 46

తే॥ బువిని వెంకమవీరరాఘవులు గనిరి
వెలఁదులిరువురనన్నుఁ గలుప ముగురు
చిఋతలను, రాముఁడును లక్ష్మి చెలులపేళ్లు
గవరరాజన నాపేరు గ్రాలుచుండు॥ 47

సీ॥ చదువులసత్తి యొజ్జలయందుఁగలబత్తి
చిన్నదైనను గైత సెప్పువాఁడ
పేదలకడనీవి పెద్దలగనుకేవి
నున్నదైనను జేరుగన్న వాఁడ
బాటలఁగలనేర్పు పాటలఁగలయోర్పు
లేమియైనను గంతు లేయువాఁడ
పసులపైఁగలపేర్మి బందులపైఁగూర్మి
లేకున్నఁదలయెత్తి త్రాఁకువాఁడ

కానఁ బెద్దలు విద్దెలఁ బూనుమగలు
గబ్బపుఁగూర్పరులుఁ దప్పుగలిగెనేని
దిద్ది మన్నింపవేఁడు దీసుద్దిదప్పు
వారినన గారిరాజనుపేరు నాది॥ 48

క॥ నాతండ్రి వాడుకలలో నేతీరునఁ గైత సెప్ప నేమించెను నే
నాతీరున నేకబ్బపు। బ్రాఁతఁ దొరకొంటి వీరరాఘవు పేరన్॥ 49

షష్ఠ్యంతములు

క॥ అటువంటి వీరరాఘవ
దిటవరిగని కెక్కుడైన తేజునఁ బ్రొద్దున్
జిటిలించు మేలిమగనికిఁ
గొటికలతిగ గొట్టు జెట్టిఁ గొలిచెడి దొరకున్॥ 50

క॥ వెన్నునిపై బత్తిని బెర। బన్నంబుల సాయపడెడి పాటున సత్తిన్
జన్నియ పత్తిరి నెత్తిని। బొన్నుపడఁ గ్రాలుచుండు పోటుమగనికిన్॥

క॥ బంగారు బ్రుచ్చిలుట మొద। లుంగల దోసంబులై దులోటొందంగా
సంగాతి కాండ్ర వెతలుఁను। పంగానిత్తెంబు మెలఁగు పడవాలునకున్॥

క॥ ముక్కంటి కొలువు సేఁతల। బక్కల గుడ్డులను గుంట్లవనటల నేర్చ
న్దిక్కించుఁ బజల పొగడిక। జిక్కిన కీరితిగలట్టి జెట్టులగనికిన్॥ 53

క॥ ఊరూరఁ బేరుగాంచిన
వారల (లో మొదటి) యుంకెవానికి నన్నున్
గారాముఁ బెనిచిన కని
కారపుమదిగలుగు బ్రెగడగమి దిటవరికిన్॥ 54

క॥ ఉసురుల కగచాట్లొదవెడి
మసలుటలుడిగించి మంచిమానిసియై యిం
పెసఁగఁగ దబ్బరకూటువు
దెస నెడదం ద్రిప్పి తిరుగు దిట్టలధణికిన్॥ 55

వ॥ నిత్తెంబు హత్తుచుండు లగ్గు లగ్గలముగఁ జెలంగుచుండ నా
యొనర్పంబూనిన హరిశ్చంద్రునికతకుఁ ద్రోవయొట్టిదనిన, 56

• కథాప్రారంభము •

మ॥ సిరిచూలాల్మాదిరి జోగిపిండ్ల కిరవై జేజేల మేల్బెట్లతోఁ
బురుడో మ్రాకుల గూళ్లువెట్టు గతిదాల్పుల్ వేల్ రొదల్ సేయన
బ్బురమై యొంటనిజంట లొండొరుల చెల్మిల్ గోరఁ బూల్బండ్లచేఁ
దిరమై నేలను దైవ్వతపా నడవి సుద్దీ గొప్పదై ద్రాలెడిన్॥ 57

సీ॥ ఆకుల నీళుల నడవిదుంపలయెరఁ
దనిసి జన్నెలోన (ర్చెదరు) తబసులు
తబసులు వేల్పునాదంబీక నీర్మేత
వలనుఁబోకుండుఁ బిట్టలు మెకాలు
పిట్టల మెకములఁ బెరవా జోగివా యెంచి
త్రుంచఁజూతురు కోనచెంచువారు
చెంచువారిని బెంచుచెలులని యేగితో
ట్రిల్లుఁ బెంపుకు (వా) నెమళ్లు లేళ్లు
నెమ్మిలేళ్ల (ందు) నెఱపు నేస్తమ్ముఁబులులు
పులుల చిఱుతలతో నాడఁబోవుఁ బసులు
పసులు ద్రావఁగ మేల్నిటిబస కొలఁకులు
కొలఁకు లంచలఁ దమ్ములఁ జెలఁగుచుండు॥ 58

క॥ ఆకొలఁకులు క్రుంకులకై
వీఁకఁగఁజను దెంచు తబసివెలఁదుల చనులన్
బ్రాఁకొన్న పనపునిగ్గుల
జోకఁ గలకఁబాఱునీటఁ జొప్పడి యలరున్॥ 59

తే॥ అట్టికొలనులలోపల నన్ని దెసలఁ
బసిఁడిమెట్టులు గట్లపైవరలు చిన్ని
గుబురుమ్రాఁకులు నీటిపై గొనబు కల్వ

గములు తామరపూ ల్గలఁ గ్రొలునొకటి॥ 60

తే॥ దానియొద్దున గుబురై కడానిబోసి
చిగురుజొంపములను విందుచేసికూయు
చలరు కోవెల చిల్క మొదలు పులుఁగుల
తావరంబైన యొక్క క్రొమ్మావి దనరు॥ 61

క॥ అమ్మావినీడ జనుకొను
కుమ్మలికముదోఁచు నడవియునికినగలఁబోఁ
దమ్ములునలుగురుఁ జెలియుఁ ది
రమ్మగు జడదార్లఁ గొలువఁ గ్రాలెడిరచ్చన్॥ 62

ఉ॥ ఉన్నడ నాల్గుప్రాజదువు లూటగ వా వెలిరాఁగ వేడివె
ల్గు న్నగు మేనితే జలరఁ గొండలనూను మొదల్గ బాసవాల్
మిన్నలరచ్చు నెన్నఁబడి మిన్నికవేల్పునవొప్పు జోగితేఁ
డన్నిటఁ బెద్దవాఁడు కొలలన్నిటిఁ జేర్చిడిసత్తువాఁడొగిన్॥ 63

సీ॥ బూదిరేకలుమూను మొగమున నొప్పార
ముక్కంటికంటిపై ర్లకున్నఁ దగ
చిగురులాగెల్లనౌ జిగిజడల్ బరువూనఁ
గైయూఁత మోనుగుకట్టగాఁగ
నేమంపుఁబులితోలు నెఱికడానముగాఁగ
తెల్లుటుంగ్రోలుఁగ్రాల్ వ్రేళ్లతోడ
అచ్చమాపటికగు ల్లమరు చేపేరుతోఁ
దెలివిగ్గులీను జందెంబుతోడ
గొలలఁబోగొట్టు నేటినీర్గలుగు జడిపి
తోడ నగ్గించు కొలువర్లతోడఁ దాల్మి
కనికరపుఁగల్మిచూ పొప్పఁగా మృకండు
కొడుకు జముమూలిపెంకికి వెడలివచ్చె॥ 64

క॥ వచ్చుటయుజోగికెదురుగ। నచ్చటిజముపట్టి తమ్ములందఱుఁదోడ

న్వేచ్ఛయ నేగి తబసిఁ గ్రిచ్చుటఁగొని తెచ్చి బత్రిఁగయి మోడ్పులతోఁ
మ॥ అడుగుందమ్ముల మబ్బుఁబూఁ గడిగి యెయ్యేన్ నెత్తులం దాల్చియొ
క్కడుఁగొన్సెందఁగఁ గ్రద్దపైననిచి "నాకున్ నేఁడు మీరాకచే
నిడుమల్ వోయెను బండెఁ గోరికలు మాయిల్ సేమముంబొందె ని
ట్లేఁడు మాయంతటివున్నముం గనెడివాఁడేయంచు సగ్గించుచున్
చ॥ "కొలఁగమితమ్మిచాల్ కడలికూనపు తేజన వేడివేల్పు పు
మ్మలికపుదూదితిప్పలకు మంటపు గొప్పతబంబుచేతఁ బెం
పులుగనినాఁడ వక్కటికపుంగని వత్రిగవేల్పులెల్ల నీ
మలయుటఁగల్గ పాఁకఁబడు మానిసివే బలుకొల్ప వెన్నఁగాన్॥ 67
తే॥ అడవి నెలవర్లగుంపులయందుఁ గాత
యట్టి పెద్దవు నీవుగా కగు నవంచు
మీరలుంగనివార లెవ్వారుగలరు
జగముతిగలో మృకండుజోగిగనిపట్టి!॥ 68
క॥ కానందొల్లిబుఁ విడిచి, యేనెట్టులొయేట్లుల డవి కేగి పిదపమేల్
పూనినజేఁ డుండినన । వ్వానికతన్ వినఁగ జెప్పఁడక్కటికముతోన్॥" 69
క॥ అనియిట్లడిగిన గుదెదా
ల్పునిబిడ్డం గాంచి తబసిపులి యిట్లనియెన్
గనికరముఁజూసి "త్రేడా!
విను నీయడుగుటకు జబువెట్టఁగ నెలమిన్ 70
క॥ వినుపించెద నొకకత స
న్మనసిన సందియము వోవ నెలమి నెలకొనన్
దనివిని విను" మని చెప్పఁగఁ
బనిగొనియెను గానయుసికేపట్టిముగఁ డిటుల్॥ 71

• అయోధ్యాపురవర్ణనము ॥

సీ॥ పంటలన్నిటి కున్కిపట్లైన కాల్వల
నింపారుసరయునా నేఱుగలిగి

మిన్నంటు తెఱగంట్ల మేడలపస నెన్ను
నెత్తైనకోటల యింపుగలిగి
మున్నేఱు లిట పీట ముడివేయఁబడియెనా
లోఁతౌ నగడ్తయల్కొటలుగలిగి
చక్కనిరోదఁజేయు టెక్కదాల్పులు డాఁగ
డంబుచెల్లున్న తోఁటలునుగలిగి
పుడమివిరిఁబోఁడి కొక వింతతొడవనంగ
కలిమిచెలి కాపురముసేయు నెలవనంగ
మంచిమానిసిదీటువుల మంచెయనఁగ
వెలయు సాకేతమను పెద్దవీడొకండు 72

సీ॥ నిలువుగన్నులుగల్గి నీటియీవర్లపై
నెక్కు రాజేల్ప్రోలి యేపునంచి
కమపరానట్టి రొక్కములపాఁతులుగల
డాకడేలికవీటి జోక నెన్ని
ఎప్పుడుఁ బనిఁజేయు చెటకేగఁ బేర్లేని
తాతయేలెడిప్రోలిఁ దగవుఁబెట్టి
మొదలుతుదియు లేక యొదుటఁగన్పడనిసం
తున్న నల్వయ్యప్రోల్చెన్ను నెన్ని
చూడసొగసైన మేల్కట్ల సొబగుగలిగి
తరుగులేనట్టి రోయీవి దనరియుండి
పేరుగలిగినదంటల బారుగలిగి
అచ్చపుం బుట్టువులచేత నలరెవీడు 73

సీ॥ రతనాలలోఁగిళ్లు రాణించునంగళ్లు
గొనదైనవాకిళ్లు గొప్పగుళ్లు
నీటిజంత్రపుఁజాళ్లు నెఱిచల్వపందిళ్లు
కసవుగల్గినబీళ్లు మిసిమిరాళ్లు

మంగళకరములగు సుఖములనుభవించి యనంతరము పరమపదసుఖము నొందఁగలఁడని యీ "యస్థాపయితుముద్యుక్త శ్శ్రద్ధయైవాక్షమోపి సః ఇమంధర్మం మహాశైల సోపిముక్తిమవాప్నుయాత్" అని స్కాందవచనము చెప్పుటచేతను మఱియు నందే "శక్తోయస్థాపితుం ధర్మముపేక్షాంకురుతేనరః సోసిపత్రవనంనామ నరకంప్రతిపద్యతే" (అనఁగా నెవఁడు స్వధర్మసంస్థాపనమునకు సమర్థుఁడై యుండియు నుపేక్షించునో వాఁడసిపత్రనామక నరకమును బొందుచున్నాఁడు) అను ప్రత్యాహువచనము మాకు వెఱపుఁగలిగించుటచేతను, శ్రీమదార్య నారాయణమూర్తిగారు నిర్హేతుకజాయమానకృపాకటాక్షవీక్షణులై తామురచించిన ప్రశ్నార్ణవమును మాలో శి. వీ. పాకయాజికిఁ బ్రత్యేకముగాఁ బనివడి పంపుటచేతను ఆప్రశ్నార్ణవమందలి విషయములు శాస్త్రవిరుద్ధములు ననుభవదూరములు, నవమానకరములు, యుక్తివిరోధములు, సంఘవినాశకారకములు నై యుండుటచేతను, వీనిని విమర్శింపక యుపేక్షించినచో వానివలనఁగలిగెడి నష్టములకు బ్రపంచముతోఁపాటు మేమును బాత్రులముగావలసియుండుటచేతను, నివిమర్శన గ్రంథరచనకుఁగడంగితిమి కానఁ బ్రకృతమునకు వచ్చుచున్నవారము. శ్రీ నారాయణమూర్తిగారి ప్రశ్నార్ణవమును బూర్తిగాఁ జదువఁగా వారివాదమునందు మూఁడుసారాంశములు మాకు గనుపడుచున్నవి, అవేవన?

(1) శ్రుతిస్మృతిపురాణేతిహాసములందు బ్రాహ్మణాదివర్ణచతుష్టయము పుట్టుకతోఁ బుట్టలేదని వర్ణింపఁబడినది.
(2) వర్ణములు గుణకర్మలనుబట్టి విభాగింపఁబడినట్లు మీఁదఁదెలిపిన ప్రమాణగ్రంథములందుఁ గలదు.
(3) ఇందులకుఁ బూర్వనిదర్శనములుగలవు.

ఈమూఁడును ఖండనార్హములై యున్నవి. ఈవిషయ మీదిగువ గ్రమముగా విశదీకరింపఁబడును. మూర్తిగారి మొదటిసారాంశమును విమర్శించుటకు ముందువారు గావించిన

## జాతి వర్ణ శబ్దార్థవిచారము.

విచారించవలసియున్నది. వారి విషయమును ముచ్చటించునపుడు "సాలెపురుగు జాలమును నిర్మించినట్లు ఇతరపురుగులు నిర్మింపఁజాలవు. మధుమక్షికములవలె నితరమక్షికములు తేనెనుగూర్పజాల . గుఱ్ఱముయొక్క వాలచలనము గోవునకు లేదు ఇవన్నియు వేఱువేఱుజాతులు శూద్రబాలుఁడు సంస్కారశిక్షణాదులచేత బ్రాహ్మణునికి సమానముగా పూజాపాఠములచేయగలడు. కావున మృగాదులకువలె మనుష్యులలో జాతిభేదములేదు." అని తెలిపి తరువాత "వర్ణము జాతి విభిన్నములు." అని తెగఁబెట్టి వ్రాసియున్నారు. వీరి యీయాశయమునుబట్టి చూడ వర్ణవ్యవస్థయందు వాడఁబడు జాతివర్ణశబ్దములు సమానార్థకములుకావని తెలియవచ్చుచున్నది. ఇట్లనుట తప్పు. మూతిఁగాని మనశాస్త్రములనుఁజూడని దోషము విశేషముగఁ బీషించుచున్నది. చూడుడు. గురుబాలప్రబోధిక 185 పుట "వంశోన్వాయస్సంతానో వర్ణాస్స్యుః బ్రాహ్మణాదయః, విప్రక్షత్రియవిట్ఛూద్రాః చాతుర్వర్ణ్య మితిస్మృతం" బ్రాహ్మణక్షత్రియవిట్ఛూద్రజాతులు వర్ణములనంబడును. "వర్ణ్యంతే కపిలారుణపీతకృష్ణవర్ణైః నిరూప్యంతఇతి వర్ణాః వర్ణస్తుతౌ" కపిలారుణ పీతకృష్ణవర్ణములచేత స్తోత్రముచేయఁబడునవి. "కపిలాశ్చారుణాః పీతాః కృష్ణాశ్చేతి పృథక్పృథక్, బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాశ్శూద్రాశ్చేతి వివక్షితా" ఇతి విష్ణుపురాణే బ్రహ్మక్షత్రవిట్ఛూద్రవర్ణములుగూడి చాతుర్వర్ణ్యమనంబడును. "చత్వారోవర్ణాః చాతుర్వర్ణ్యం"నాలుగుజాతులుకానఁజాతుర్వర్ణ్యము" అని వర్ణశబ్దార్థవిచారము దెలుపఁబడియున్నది. ఇందువలన జాతివర్ణశబ్దములుసమానార్థకములనిస్పష్టమగుచున్నది. జాతిశబ్దమునుగూర్చిగురుబాలప్రబోధిక 47వ పుటను "జాతిర్జాతంచ సామాన్యం" జాయతఇతి జాతిః. జాతంచ, ప్రాదుర్భవించునది. అని తెలుపఁబడియున్నది. దీనివలన జాతియనఁ బుట్టువని తెలియవచ్చినది. ఇం దేమేని సందే

హాముున్నదానినీ శబ్దరత్నాకరము తుడిచిపెట్టుచున్నది. ఇటుచూడుడు జాతి=కులము. పుట్టుక, ...పదునెనిమిదిజాతులు (బ్రిహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రి, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాణ, కుంభకార, తంతునాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, తిలఘాత,లుబ్ధక చండాల, మాతంగజాతులు) మరల 969 పుటలో వర్ణము=బ్రాహ్మణాది. (బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు) అని యివి నాలుగు. అని తెలిపియున్నది. ఈవిమర్శవలన జాతివర్ణ శబ్దములు సమానార్థకములని బాలునికిఁగూడ బోధపడుచున్నది. మే మిన్ని ప్రమాణములు చూపించినను మా నారాయణమూర్తిగారు కొంచె మింగ్లీషుభాషాసంస్కారముకలవారివలె నున్నారుకాన నాంగ్లేయనిఘంటునుండి ప్రమాణములఁ జూపనిచో మెచ్చరేమోయని యాకొఱతగూడఁ దీర్చుచున్నవారము. కనుఁడు బౌనుదొరగారినిఘంటువు 323పుట. జాతి=Caste or birth, జాతులవాండ్లు=People of various castes. 900 పుటవర్ణము Caste, బ్రాహ్మణాదిజాతులు. అని పరదేశీయులును బండితవరులును బక్షపాతరహితులును లోకజ్ఞాననిధులును నగు బ్రౌనుదొరగారు జాతివర్ణ శబ్దములురెండును సమానార్థకములని తెలిపియుండిరి. గాన నిదివరకీ విషయము మామూర్తిగా రెఱుంగకపోయినను నిపుడిది చదువుకొనిన పిమ్మటనైన జాతివర్ణములు భిన్నములను పిచ్చిపట్టుదలను వదులుదురు గాత. అట్లేలవదులుదురు.

శ్రుతులు వర్ణవిభాగము

గావించియున్నవి. కానియావిభాగము పుట్టుకతోనే వర్ణములు వచ్చినట్టు తెలుపలేదఁట! చూడుడు "బ్రాహ్మణోస్యముఖమాసీత్ బాహూరాజన్యః కృతః. ఊరూతదస్యయద్వైశ్యః. పద్భ్యాగ్ంశూద్రో ఆజాయత., అనుమంత్రమునకు పుట్టుకతో వర్ణమువచ్చునను అర్థమును కాకినాడ హారిశ్చంద్రిరావుప్రభృతులువ్రాసియుండుట వేదవిరోధము.2 యుక్తివిరుద్ధము. 3 వ్యాకరణవిరుద్ధము 4 ఆక్షేపపద్ధతికి విరుద్ధముగానుండలేదా? ........... ఈశ్వరుఁడు శరీర రహితుడుగావున వాని

కంగములుకలవనుట వేదవిరోధముకాదా? ఒకని శరీరాంగములందు నాలుగువర్ణములుపుట్టుట యుక్తివిరుద్ధముకాదా? ముఖబాహూరు శబ్దములు ప్రథమావిభక్తులు. పద్భ్యాంఅనుశబ్దము పాదవ్యత్యయమని సంస్కృతవిద్వాంసులు చెప్పుదురుకదా? ఈమంత్రమునకు పూర్వమంత్రము నందు ..ఈసృష్టిరూపమగుపురుషునకు శిరస్సేది? భుజములేవి? ఊరువులేవి? పాదములేవి? అనుప్రశ్నలున్నవికాన పుట్టుకతో వర్ణమనుట వ్యాకరణ విరోధముకాదా? ఆప్తేయవిరోధమును గాదా?,, అని నారాయణమూర్తిగారు ప్రశ్నార్ణవముఖమున మనలఁ బ్రశ్నించియున్నవారు కాని "బిడ్డనెత్తుకొన్న సంతోషములోఁబడి గుడ్డతొలిగినది చూచుకొనని" వారివలె మనమూర్తిగారు ప్రశ్నలసముద్రమును సృజించు సంతోషములో మునిఁగి తమవాదమును దామే పావనహస్తములతో నిర్మూలించుకొనుచుయున్నవారు చూడుడు. మొదట "ఈశ్వరుఁడు శరీర రహితుఁడుగావునవానికంగములుకలవనుట వేదవిరోధముకాదా" యను ప్రశ్నవాక్యము నే పావనహస్తముతో లిఖించిరో యాపావనహస్తముతోడనే యావాక్యముదిగువనే మరల "ఈసృష్టిరూపమగు పురుషునకు శిరస్సేది? భుజములేవి? ఊరువులేవి? పాదములేవి? అను ప్రశ్నలు వేదమునందున్నవి" అనువాక్యమును వ్రాసియున్నవారు. మొదట "ఈశ్వరుడుశరీరరహితుఁడ"ని చెప్పి యావెంటనె యాయీశ్వరుని "సృష్టిరూపమగుపురుషునిగా వేదముచెప్పుచున్నదని వ్రాసినఁదమ వాదము వేదవిరోధమై నశించలేదా? ఇపుడు వేదవిరుద్ధవాద మెవరిది? అనేకభువనబ్రహ్మాండములను సృజించి పెంచి హరించు సర్వశక్తులుగల పరమేశ్వరుఁడు తన ముఖబాహూరుపాదములందు నాలుగువర్ణములను బుట్టించుట మన మూర్తిగారి కాళయుక్తులకు విరుద్ధముగాఁ దోచునుగాక. దోచినంతనే యది యసత్యమనినమ్ముటవలన నీశ్వరుని సర్వశక్తిహీనునిగాఁ దలంచుటకాదా? ఈతలంపు యుక్తివిరుద్ధము వేదవిరోధమును గాదా? ముఖబాహూరుశబ్దములు ప్రథమావిభక్తులుగానున్నవికాన వానివలన బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు పుట్టినారని చెప్పు

ట తప్పని మూర్తిగారు చెప్పుచున్నవారు. పోనిండువాదమునిమిత్తము కొంచెముకాలము ముఖబాహూరుశబ్దములు ప్రథమావిభక్తులుగా నుండుటచే వానివలన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు పుట్టిరని చెప్పుట తప్పని తలంతముఅట్లుపై "పద్భ్యాగ్ం శూద్రో అజాయత" అనియున్నది, పద్భ్యాం=పాదములవలన, శూద్రః=శూద్రుఁడు, అజాయత=పుట్టెను, అనియర్థముఇదియుఁ దప్పుకాదుకదా? "చంద్రమా మనసో జాతః" అను మఱియొకవాక్యముకలదు. దీనికి, చంద్రమాః= చంద్రుఁడు మనసః= ఈశ్వరునిమనస్సువలన; జాతః=పుట్టినాఁడు,, అని యర్థము. ఇదేమైనఁ దప్పగునా? ఇంతియకాదు"చక్షోః సూర్యో అజాయత,, అనగా,చక్షోః=భగవంతునినేత్రమువలన, సూర్యః=ఆదిత్యుడు, అజాయత=పుట్టెను. ఇదియెగాక "ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత అనగా ముఖాత్= పరమేశ్వరుని ముఖమువలన, ఇంద్రశ్చ= ఇంద్రుడును, అగ్నిశ్చ= అగ్నియును, ప్రాణాత్= ఈశ్వరుని ప్రాణమువలన,వాయుః=వాయువును, అజాయత= కలిగెను. అనియర్థము. ఈయర్థముల నొకవేళ మన నారాయణమూర్తిగారివంటి ఘన పండితులు తప్పులనుగాదలంతురేమోకాని సంస్కృతవిద్వాంసు లెన్నటికిని దప్పనజాలరు. ఇవితప్పుగానప్పుఁడు వీనికిఁబూర్వముననున్న ముఖబాహూరుశబ్దములు ప్రథమావిభక్తులుగానుండినను వానివలన బ్రాహ్మ క్షత్రియవైశ్యులుపుట్టినట్లె సంస్కృతవిద్వాంసులర్థముచేయుదురు.కాని విరుద్ధముగా జేసి యవివేకులనిపించుకొనజాలరు. ఇంతవఱకు గావించినవిమర్శవలన మూర్తిగారు పుట్టుకతో వర్ణమురాదు గుణకర్మలనుబట్టివచ్చుననుటకై యీశ్వరుడు నిరాకారుఁడని వాదించిన మనమూర్తిగారివాదమే నిరాకారమునుబొందినదని తేలినది. ఇట్లుచెప్పగనే యీయపార్థములు మీరుకావించుచున్నవారుకాని.

మనువు వర్ణవిభాగముఁ

జేయుచోట నైౕ "బ్రాహ్మణోఽస్యముఖమాసీత్. బాహూరాజన్యఃకృతః. ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయ

త." అనుమంత్రమునకు మేముచెప్పినట్లు గుణకర్మలనుబట్టి వర్ణవిభాగముచేయవలెననెడియర్థమును గావించుకొనియె "శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతిశూద్రతాం" అని వ్రాసియున్నాడు. అనగా శూద్రుడు బ్రాహ్మణత్వమునుబొందును బ్రాహ్మణుడు శూద్రత్వమునుబొందునని యర్థము. ఎందువల్లనని యడిగెదరా? సద్గుణసత్కర్మలవలన శూద్రుడు బ్రాహ్మణత్వమును, దుర్గుణదుష్కర్మలవలన బ్రాహ్మణుడు శూద్రత్వమును బొందెదురని చెప్పుచున్నాము. "అనిచెప్పి యీప్రమాణప్రకారము ప్రవర్తింపనివారు వర్ణబాహ్యులు కారా?" అని మనల నడుగుచున్నవారు. ఇంతకంటె లోకవంచకవాదముమఱియొకటి కానరాదు. అదేమనెదరా? వినుడు. "శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం" అనుశ్లోకములో సుగుణసుకర్మలవలన శూద్రుడు బ్రాహ్మణత్వమును దుర్గుణ దుష్కర్మలవలన బ్రాహ్మణుడు శూద్రత్వమును బొందుననుపదము లెక్కడనున్నవి? లేనిపదములను నర్థములోనికిలాగి విపరీతార్థములుతాముగావించి లోకు లపార్థములను జేయుచున్నారని వారినిదూషించుట కలిబోధసారము కాదా? ఇదియిట్లుండనిండు. పైశ్లోకము బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమునుగూర్చి ముచ్చటించునదికాదు. ఇంకేమన మనుస్మృతి10అధ్యాయములో సంకరజాతుల వ్యవస్థనుగూర్చి ముచ్చటించునదియై యున్నది. దీనివిమర్శనము తరువాత చేసెదము పుట్టుకతోడనే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములువచ్చినవని మనుప్రజాపతి యాపదియవ యధ్యాయమునందె వేఱొకచోట దెలిపియున్నవాడు. ఆశ్లోకములను జూడుడు (మనుపు అ 10 శ్లో 4-5)"బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః త్రయోవర్ణా ద్విజాతయః చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః" అనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను మూడు వర్ణములవారును ద్విజాతులు (అనగా రెండవజన్మకలవారు) నాలవవాడగు శూద్రుడొక్కపుట్టుకయె కలవాడు (అనగా శూద్రునకుపనయనము లేదుకాన రెండవజన్మములేదు. అందువలన నొక్కజన్మ

ముకలవాఁడగుచున్నాఁడు) అయిదవజాతివాఁడు లేఁడు. అని చెప్పి వెంట నే " సర్వవర్ణేషు తుల్యాసు పత్నీ ష్వక్షుతయోనిషు। ఆనులోమ్యేన సంభూతా జాత్యాజ్ఞేయా స్తవతే " నాలుగువర్ణములయందును దన జాతివారుగాను వ్యభిచారదోషము లేనివారలుగాను నుండెడు భార్యల యందు వారినివివాహమాడిన భర్తలకుఁ బుట్టినపుత్రులుమాత్రము పుట్టుకచేతనే వారిపుత్రులుగాఁ దెలియ దగినవారు అని కంఠోక్తిగా బుట్టుకచేతనే వర్ణమువచ్చునని మనువు తెలిపియున్నవాఁడు. ఇంతియె కాక ప్రథమాధ్యాయములో సృష్టిక్రమమునుగూర్చి ముచ్చటించుసం దర్భమునఁ బైమంత్రార్థముగా నుండునట్లు స్పష్టముగా బ్రహ్మతనయొ క్క ముఖబాహూరుపాదములవలనఁ గ్రమముగా బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులను సృజించినట్లు చెప్పియున్నవాఁడు. చూడుఁడు (మ నువు. అ 1 శ్లో 31) "లోకానాంతు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాద తః। బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయత్ " అనఁ గా బ్రహ్మయే లోకములయొక్క యభివృద్ధికొఱకుఁ దన ముఖబా హూరుపాదములవలన బ్రాహ్మణుని క్షత్రియుని వైశ్యుని శూద్రుని సృజించెను. అని యర్థము. మనుప్రజాపతి యింతవిస్పష్టముగా నింత సుబోధకముగా బ్రాహ్మణాది జాతివ్యవస్థ గావించియుండఁగానీశ్లోకము లనెల్ల మూలమూసిపెట్టి యీవర్ణవ్యవస్థకు నేవిధమైనసంబంధము లేని దియు సంకరజాతివ్యవస్థనుగూర్చి ముచ్చటించునదియు నగు "శూద్రో బ్రాహ్మణతా మేతి " అను వచనమునుజూపి మనువు గుణకర్మలను బట్టి జాతివిభాగము గావించినాఁడని చెప్పుట లోకవంచనము చేయుటకా దా? మన నారాయణమూర్తిగారికిఁగాని యార్యధర్మోపదేశకులగు వై!! నారాయణమూర్తిగారికిఁగాని యీలోకవంచనము నేర్పుటకు గురుత్వముగావించినవారు శ్రీ దయానందసరస్వతీస్వాములవారె. వారి సత్యార్థప్రకాశను 112పుట మొదలుకొని 117వ పుటవరకును మన మూర్తిగారు గావించిన యసంగతవాద మతయుః గలదు. వారిపలుకులనే చిలుకలవలె మీరనుకరించి తమ యవ్యక్తమధురాలాప

ములంతో రహస్యసారములను బ్రహ్మార్ణవములనుబూరించుచున్నవారు ఈగ్రంథముల రచించుటవలన దమలోకవంచకత్వమును నపాండిత్యమును వెల్లడిచేసికొనుటయెకాని యింతకుమించిన ప్రయోజనమును గాంచఁబోరు.

ఇకవారు మనుస్మృతినుండియిచ్చిన "శూద్రో బ్రాహ్మణతామేతి" అనువచనముంగూర్చి యించుక సమాధానమిచ్చుచున్నవారము. ఈశ్లోకమును దీనికివెనుకనున్న శ్లోకమును బరస్పరసంబంధముగలవి. ఇందు మొదటిదానినివిడిచిన రెండవదాని కర్థముకానేరదు. ఇట్లుండఁగా మనమూర్తిగారు ఈశ్లోకమునకు విశేషించివ్రాసిన యర్థమేమియు లేదుకాని వీరిగురువులగు శ్రీ దయానంద సరస్వతీస్వామివారుమాత్రము విపరీతార్థమును వ్రాసియున్నారు. దానినాధారముచేసికొనియె మనమూర్తిగారుఇత్యాదిప్రమాణప్రకారము ప్రవర్తింపనివారు వర్ణబాహ్యులుకారా? ,,అని మనల నడిగియున్నవారు. వీరుచెప్పినప్రకారము ప్రవర్తించెడివారు వర్ణబాహ్యులయ్యెదరో! వర్తింపనివారు వర్ణబాహ్యులయ్యెదరో చూచుకొందము. శ్రీ స్వామివారు సత్యార్థప్రకాశిక 114 పుటను"శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం। క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యా త్తథైవచ" అనఁగా శూద్రకులమునం దుత్పన్నులైనను బ్రాహ్మణక్షత్రియవైశ్యులవంటి గుణకర్మస్వభావములు కలవారైరేని వారు బ్రాహ్మణక్షత్రియవైశ్యు లగుదురు. అట్లె బ్రాహ్మణక్షత్రియవైశ్యకులములం దుత్పన్నులైనను శూద్రునివంటి గుణకర్మస్వభావములుగలవారైరేని శూద్రులగుదురు. అట్లె క్షత్రియకులమందుఁగాని వైశ్యకులమందు గాని యుత్పన్నుఁడై బ్రాహ్మణునితోఁగాని శూద్రునితోఁగాని సమానుడయ్యెనేని బ్రాహ్మణుడుగాని శూద్రుడుగాని కాఁగలఁడు అనగా నాలుగువర్ణములందును నేయేవర్ణముతోసమానులగు స్త్రీపురుషులు ।ఆయావర్ణములందు గణింపఁబడుదురు.

# సూత సంహిత

## చతుర్థాశ్వాసము

---(o)---

కం॥ శ్రీమత్కోలగానికులోద్ధారాకృతికోటరూభిధస్తుతచరితా!
కామితదాయక! వటతరుధామా! శ్రీదక్షిణాస్య! దాక్షిణ్యనిధీ!॥

వ॥ దేవా! యవధరింపుము యజ్ఞవైభవఖండ పూర్వభాగమాహాత్మ్యం బెట్టిదనిన. 2

సర్వవేదాంతార్థసారప్రశ్నము

సీ॥ సత్రావసానైకసన్నద్ధులును సర్వ
వేదార్థవేదులు విమలమతులు
సర్వలోకహితార్థసంయుక్తులును సర్వ
శత్రువర్జితులు నిశ్చలులు సర్వ
బాధావిముక్తులు ప్రకటసారాసార
విజ్ఞానవంతులు వేదపార
విధులు నభ్యాగతాతిథిపూజనాసక్తు
లామ్నాయవిత్పూజనాభిరతులు
వృద్ధగురుజనసేవకు లిద్ధచరితు
లనఘు లభిమానవర్జితు లాత్మవిదులు
స్వస్థవృత్తులు ద్వంద్వవివర్జితాత్ము
లార్జవాఢ్యులు బహుమృదుతాభియుతులు॥ 3

వ॥ మఱియు రుద్రాక్షమాలికాధారులును సితభస్మోద్ధూళితశరీరులును త్రిపుండ్రావళీవిరాజితులును జటావల్కలసంయుతులును నమితతేజోమూర్తియగు శివుని లింగం బర్చించువారును శివాభిమానసంపన్నులును శివభక్తిపరాయణులును శివనామజపధ్వస్త పాపపంజరులును సంసారవిషవృక్షమూలచ్ఛేదనతత్పరులును శ్రౌతస్మార్తసదాచారులును విగతవిషయాభిలాషులును బుణ్యాత్ములయందు మైత్రియుఁ బాపకర్ములయందుపేక్షయు సుఖితులయందు సంతోషంబును

దుఃఖితులయందుఁ గరుణయునుం గలవారు నైన యమ్మహామునులం
దఱును వ్యాసప్రసాదసంపన్నుండును విశ్వవిజ్ఞానసముద్రుండును విశ్వా
త్మవేదియును విధ్వస్తభవకాంతారుండును మహాత్ముండును నగు సూ
తుని భక్తిచేత స్మరింపుచు స్తోత్రంబులు సేయుచున్నసమయంబున శ్రీ
మంతుండును మహాకారుణికోత్తముండును సర్వజ్ఞుండును సర్వభూతా
భీష్టఫలప్రదుండును ప్రభుండును మహాతేజోమూర్తియు నగు సూతుం
డు రాత్రియందు సూర్యుండునుంబోలె యావిర్భవించిన నమ్మహాత్ము
నింజూచి ఋషులందఱును విస్మితులును గద్గదస్వరులును నై దండప
్రణామంబులాచరించి వరాసనాసీనుం జేసి పాదప్రక్షాళనం బాచరించి
పరమశ్రద్ధ నప్పుణ్యాత్ముని గంధపుష్పాదులం జిరకాలంబు పూజించి
"సర్వవేదార్థం బెఱింగింపు" మనియడిగిన సూతుండును స్వగురు
మూర్తిందలంచి జగద్గురుండగు మహేశ్వరుని సర్వవిద్యామయియగు
నుమాదేవిని విఘ్నేశషణ్ముఖులం దలంచి భూమియందు దండవన్నమ
స్కారంబులాచరించి కృతాంజలిపుటుండై సర్వవేదార్థంబును దెల్ప
టకు నారంభించి "సర్వజగద్విభాసకుండును దివాకరాదిమహాజనుల
కగోచరుండును సంసారవిష మహాషధుండును నగు మహేశ్వరునకు
భక్తిపురస్సరంబుగా నమస్కరించెద, పరానుభూతియు భవపాశనా
శనియు సదాశివునకు నతిశోభనప్రదయు నుత్తమచిత్తవృత్తిదాయి
నియు నానావిధలోకవైభవయు నుమాభిధానయు నగు నమ్మహాదేవికి
నమస్కరించెద"నని సూతుండు మఱియునిట్లనియె. 4

—(పరాపరవేదార్థ విచారము)—

తే॥ "ఇంక మీఁదట వేదార్థమెల్ల మీకుఁ
దెలియఁజెప్పెద శ్రద్ధచేఁ దెలియఁదగును
శ్రద్ధ లేకుండ వినుట నిష్ఫలము గాదె
అదియు రెండువిధంబులో ననఘులార! 5

సీ॥ పరఁగ వేదార్థంబు పరయన నపరనాఁ
బరఁగును,నిరెండుపదములందు
పర పరాత్పరమైనపదమగు,నపరదా
ధర్మ(సంజ్ఞం)బాచుఁ దత్పరాభి
గమనసాధనమౌను, (మును లధర్మంబునుఁ)
వేదార్థమనియొంచి విమలభక్తి
(నొక్కొకచో నెంతు రొగి విష్పటకునుగా)
ముఖ్యంబుగాఁ జేయఁబూనరెందు
అల యధర్మంబువ్రాయిన నతులధర్మ
(మత్పుభితమగు,దాన) వేదార్థసిద్ధి
యయిన బ్రహ్మంబుచేరు నోయనఘులార!
సత్యమిదియంచుఁ బాయుడీఁ సంశయములు॥ 6
చం॥ తనపరశక్తిచే శివుఁడు తద్దయు బద్ధుఁడువ్రాలెఁ దోఁచు నం
దును,పరశక్తి యొక్కటియె దుర్ఘటకారిణి మాయనాఁగఁదా
ఘనతర చిత్స్వరూప పరికల్పిత మౌను విచారదృష్టిచేఁ
గనుగొన లేనిదాట నది గాంచెను మాయ(యటన్న నామముఁ) 7
తే॥ అదియు నానందరూపుఁడై యలరునట్టి
శివునివిజ్ఞానవశమునఁ జెడునటంద్రు
వేదవేదాంతసిద్ధాంతవిమలనుతులు
సత్యమీమాట నమ్ముఁడీ సాధులార! 8
సీ॥ లోకంబులోన విలోకింపఁ గల్పిత
వస్తునాశనమైన వాస్తవముగఁ
దగు నధిష్ఠానంబె మిగులు,నట్లాటచేఁ
జిన్మాత్రజనితయై చెలఁగుమాయ
నశియించెనేని చిన్మాత్రంబె వెసనిల్చు,
నామాయ భావమంచనఁగ నది యు

ధిష్ఠానమొకటేఁ గినఁ దెగి యధిష్ఠానంబౌను
భావమంచనిన నేర్పడఁగఁ దోఁచు
అట్లుగాపునఁ గల్పితం బరయ భావ
మును స్వభావంబు నుభయము మెప్పకునుగాదు
తగ నధిష్ఠాన మొక్కటి సత్యంబెయగుట.
నాశ మొందదు,సంతతానంద మదియ 9

కం॥ పరశివవిషయజ్ఞానము
పరహింసాభిఖ్యయటికిఁ బరఁగును వేదాం
త రహస్యవిచారణమున
మఱి యన్యాశ్రమములకుం గ్రమంబుగఁ గల్గున్ 10

కం॥ వనవాసి నైష్ఠికస్థితి వనజాసనులోకమొందు, పైత్రృకలోకం
బును గాంచు గృహస్థుండును విమలశివజ్ఞానపదము భిక్షుకుఁడొందున్

సీ॥ ధరఁ గుటీచక బహూదక హంస పరహంస
నామ(ంబులను)యతుల్ నలుగు, రందుఁ
బ్రథముండు విజ్ఞానభాంగ ఛల్గుటచేత
స్వప్రమత్తత మహోఘాళిఁ బాయు
రెండవవానికి నుండు విజ్ఞానాంగ
శాంతిదాంత్యాది కేచ్ఛ్రయముఁ దలంప
నరయ మూడవవాని కఖిలవేదాంతార్థ
ములు విశుబుద్ధి విస్ఫురితమగును
నాలుగవవాఁడు వేదాంతజాలమెల్ల
వినుటచేతను విజ్ఞానవిభవ మొందు
అతఁడె పరహంస,కర్మసన్యాసి యతఁడె.
అన్యులపహతకామత యతులు దలఁప 12

తే॥ బుద్ధిపూర్వకృతంబులై పొసఁగునట్టి
పాపములఁ గాల్చి నెందు శాబ్దంబు దేశి

కాగతంబు పరోక్షంబు నైనయట్టి
బ్రహ్మవిజ్ఞాన మెంతయుఁ బ్రాజ్ఞులార! 13
తే॥ శాబ్దమపరోక్ష మాత్మవిజ్ఞాన మరయ
ఘోరసంసృతిననఁగించు భూరితిమిర
తండమడలించు చండభానుండువోలె
అట్లుగావునఁ బరహంసయగుట మేలు॥ 14

వ॥ మఱియుఁ గుటీచక బహూదకహంసులు ప్రాజాపత్యేష్టియుఁ బరమహంసుం డాగ్నేయేష్టియుం జేయవలయు, నావెనుక నందఱును సంయతమానసులై త్రైధాతవీష్టి చేయందగు, నందనాహితాగ్నులగు విప్రుల కిష్టిచేయుం బనిలేదు, వీరలందఱును స్వకీయాగ్నులయందు శ్రద్ధాపురస్సరంబుగా విరజాఖ్యమహామంత్రంబుల సాజ్యచరుహోమం బుచేసి హుతశేషంబులగు నాచరువుల సాజ్యంబుగాఁ బ్రాశనంబుచేసి ఘృతాచమనంబుగావించి స్వాహాకారయుక్తంబగు ప్రణవంబునఁ బూర్ణాహుతింగావించి యగ్నుల నాత్మారోపణంబుచేసి "అయంతే యోనిఋత్వియః" అనుమంత్రంబునఁ బ్రైషోచ్చారణంబొనర్చి సన్న్యాసాధ్వర్యుదత్తంబులగు దండకాషాయంబులు పరిగ్రహించి గురుపాదప్రణామంబుచేసి జ్ఞానార్థం బా గురుసన్నిధి వేదాంతశ్రవణంబు సేయవలయు, కామ్యకర్మఫలదోషం బెఱింగి నిషిద్ధకర్మంబునుంబోలె భిక్షుకుండు విడువవలయు, కామ్యకర్మఫలత్యాగంబున నందఱుం బరమహంస సమానులగుదురు. పరమహంసునకు జప్యమంత్రంబులు లేవు, త్రయీసారంబగు ప్రణవంబె జపింపవలయు, నన్యమంత్రజపంబున నెట్లుముక్తుండగు? సర్వవిద్యోత్తమంబైన యోంకారప్లవంబున భవాబ్ధి తరించు, సుమూర్తవిగ్రహుండును సత్యాదిలక్షణుండును దేవుండును రుద్రుండును నగు శివుం డొక్కండె సంసారతారకంబైన ప్రణవంబునకుఁ దేవతార్థం బగు, రుద్రవిష్ణువిరించ్యాదులు ముఖ్యంబుగాఁ బ్రణవార్థంబు గానేర" రని చెప్పి మహాత్ముండైన సూతుండు మఱియు నిట్లనియె.

తే॥ "అట్లుగావున విజ్ఞాన మబ్బుకొఱకు
సేవనీయంబు భక్తిచేఁ జింతనీయ
మైన కాశికిఁ బోయి విశ్వాధినాథు
శివుని సేవింపవిజ్ఞాన సిద్ధియగును॥ 16

క॥ అవిముక్తగు శివుఁ గొల్వక
భవముక్తిని గోరునట్టి పామరుఁ డెందుఁ
జనిగాని విషముఁద్రాగుచు
నవిరళమగుతృష్ణమాన్తు ననువాఁడుగదా॥ 17

సీ॥ అట్లాట నవిముక్తమాశ్రయించి మహేశు
సేవింప విజ్ఞానసిద్ధిగలుగు
వనవాసి గృహవాసి వటువులు దగ శత
రుద్రీయమంత్రంబు రూఢి జపము
(సల్పంగఁ) దగు, దీనఁ జనుఁ బాపసంఘంబు,
విజ్ఞానమగుదాన, వెలయుముక్తి
దీనితో సమమైన దివ్యమంత్రము లేదు
వేదస్మృతిగణంబు వెదకిచూడ,
దీనఁ బంచాక్షరీవిద్య దీప్తమయ్యె
దానియందున శివుఁడు సంతతమునిల్చు
నమ్మహాదేవుసన్నిధి నఖిలసురలు
వ్యష్టిభూతులు వృక్షశాఖానుగతులు॥ 18

తే॥ మూలసేకంబుచేత విశాలశాఖ
లెట్లువిలసిల్లు నట్లు లయ్యమలరుద్ర
జపముచేత సంప్రీతుఁడై శంభుఁడుండ
నన్యదేవాళి సంప్రీతి నలరఁగలరు॥

వ॥ అట్లాట రుద్రజపంబుచేతనే భుక్తిముక్తులు సిద్ధించు, మహా
శక్తియైనమాయ సత్త్వాదిగుణభేదంబున జీవునాక్రమించి సంసారంబునం

దిప్పుచుండు, సుఖజ్ఞానవైరాగ్య శుక్లవర్ణంబులు సత్వగుణంబులు, మద ప్రవృత్తికామలోహితవర్ణంబులు రజోగుణంబులు, మోహభ్రాంత్యాలస్యకృష్ణవర్ణంబులు తమోగుణంబులు, సక్రమంబున నుత్తమమధ్యమాధమపదార్థంబులు సత్వరజస్తమోరూపంబు, లట్లుగావున సర్వదేహులకు సంసారంబు మాయామయం,బదియు శివజ్ఞానమాత్రంబున సద్యోనివ(ర్తితం)బగు, (జ్ఞానయజ్ఞంబువలన)నవాస్తికులకు సమానులకు విప్రులకుఁ బరమజ్ఞానంబుజనించు, నింక యజ్ఞంబు కర్మజ్ఞానసంజ్ఞల స్థూలసూక్ష్మభేదంబులఁ బ్రవర్తిల్లు నందు స్థూలంబైన కర్మయజ్ఞంబు కాయిక వాచక మానసభేదంబులఁ ద్రివిధంబగు, నందు నిత్యనైమిత్తికంబులు కాయికంబులు, మంత్రజపంబు వాచికంబు, దేవతాధ్యానంబు మానసంబు, నవియు నుత్తరోత్తరాధికంబులు. ధ్యానం బుత్తమాధమభేదంబున రెండువిధంబు, లందు శివధ్యానం బుత్తమంబు, విష్ణ్వాదిదేవతాధ్యానం బధమం,బట్లౌటమోక్షార్థులగు ప్రాజ్ఞులన్యదేవతలవర్జించి శివంకరుండగు శివునిఁ భజించెద, రీయర్థంబునకు సాధ్వియగు శ్రుతియే ప్రమాణం, బపక్వచిత్తులచే మోక్షార్థంబు విష్ణ్వాదిదేవతలును ధ్యేయులగుదురు, పక్వచిత్తులచేత సాక్షాన్మోచకుండగు శివుండే ధ్యేయుండగు, విశ్వాధికుండగురుద్రునితోడ బ్రహ్మవిష్ణ్వాదిదైవంబులు సమానులని చింతించి సంసారంబునఁ బరివర్తింతురు, పూర్వజన్మంబున మహాపాపంబులు చేసినవారలకు విష్ణుండే సర్వాధికుండనితోఁచుఁగాని శివుండు సర్వోత్తముండనితోఁప, దట్టివారికిఁ గల్పకోటిశతంబులకైన ముక్తికలుగనేరదు, విష్ణ్వాదులకంటె శివుం డధికుండనితోఁచువారలకు ముక్తి స్వతస్సిద్ధయగు, శివరుద్రమహాదేవబ్రహ్మేశానాదినామంబుల విష్ణ్వాదిదేవతలఁ భావించి క్రమముక్తిం గాంతురు. సర్వోత్తముండగు శివుని బ్రహ్మవిష్ణ్వాదినామంబులం జింతించి ఘోరసంసారంబునం గూలెదరు, సందియంబు లేదు, రాజపత్నియందు మాతృబుద్ధి హితకారిణియగునట్లు విష్ణ్వాదులయందు శివబుద్ధి మేలొనర్చు, శివునియందు విష్ణ్వాదిదేవతా

బుద్ధి సేయఁగూడ, దక్లాట బుద్ధిమంతులచేత శివుండె ప్రాధాన్యంబుగా ధ్యేయుండగు, జ్ఞానయజ్ఞంబుకంటెఁ బరంబైనయజ్ఞంబు శ్రుతిస్మృతుల లేదు లేదు, జ్ఞానయజ్ఞైకనిష్ఠునకు దుర్లభం బొకింతయు లేదు, మహాపాపాత్ముల కది రుచింపక దానియందు ప్రద్వేషంబు జనించు, మఱియును.

మ॥ విలసద్జ్ఞానము దోఁచు నెవ్వనికి నుర్విన్ వానిచిత్తంబునన్
దిలకింపన్ శివరుద్రశంకరమహాదేవేశ బ్రహ్మాఖ్యలన్
దలఁపంజెల్వగు, రుద్రమూర్తులను రుద్రాక్షేశలింగంబులం
దల శైవస్థలభస్మపుండ్రముల నిత్యాస్థల్ ప్రవర్తించెడిన్ 21

తే॥ ఎవ్వఁడైనను సుజ్ఞాన మెలమిగలిగి
వీనియందు నుపేక్ష విద్వేషబుద్ధి
నల్పు నాతఁడు పశువు విజ్ఞానవంచ
కుండు పాపాత్ముఁ డాతఁ డొక్కండె ధరణి 22

తే॥ వసుధలోపల విజ్ఞానవంతునకును
సాధ్యసాధనపూర్వకసరణియందుఁ
గడునుపేక్షయు స్వాభావికంబుగాఁగ
శైవధర్మంబులను బ్రీతి చాలఁగలుగు 23

వ॥ అదియు బాధితాకారరూపంబె కాని వేఱగలుగదు, కలిగెనేనియు నతండును భ్రాంతుండని చెప్పవలదు, మఱియును.

కం॥ (కేవలకర్మలెచేయుచు జీవింతురుకొంతమంది, సిద్ధించెనుమా
కా విజ్ఞానమనుచునవి వ ఎడుతురుకొంతమందిమోహితమతులై)

సీ॥ అలరంగ విజ్ఞానయజ్ఞపుణ్య మనేక
కోటికల్పంబులు కొదవ లేక
నాచేతనైనను నా గురుమూర్తిచే
నైన నన్యునిచేతనైనఁ బలుక

# ప్రధాన పోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు
2 రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరు మహారజమీందారు గారు, గంపలగూడెం

## ఈ నెలసొమ్ము చెల్లించిన చందాదారులు

1. మల్లాది పున్నయ్యగారు, గుంటూరు.
2. యం. శ్రీనివాసరావుగారు, గూడ్సుమాష్ట   రు.
3. నేతి ఉమాకాంతముగారు, టీచర్.
4. ఎల్లేపెద్ది సాంబశివశాస్త్రిగారు, ప్లీడరు.
5. చించినాడి వేంకటరత్నశాస్త్రిగారు, బెజవాడ.
6. పూటుకూరి కోటయ్యగారు, చీరాల.
7. యీ వెంకటేశ్వర్లుగారు.
8. పెడవల్లి కామేశ్వరావుగారు, వకీలు బాపట్ల.
9. నోరి వేంకటేశ్వర్లుగారు.
10. పెద్దిభట్ల లక్ష్మీనరసింహముగారు, తెనాలి,
11. ప్రభల వీరరాఘవులుగారు.
12. ఘడియారం వెంకటశివశాస్త్రిగారు సంగంజాగర్లమూడి.
13. కొండుభట్ల గోపాలకృష్ణయ్యగారు వకీలు, నర్సారావుపేట.
14. శ్రీ వేంకటపాపారాయ భారతీనిలయము, మైలవరం.
15. విస్సావఝ్ఝల సీతారామయ్యగారు, నూజవీడు.
16. ఇంద్రకంటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కర్నూలు.
17. శ్రీ పఠనాలయము, తాళ్లపూడి.
18. కారుగంటి పున్నయ్యగారు, వకీలు, వంగవోలు.
19. చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు, గుడివాడ.
20. వసురాయపుస్తక భాండాగారము, రాజమండ్రి.
21. వెలమకన్ని శోభనాద్రిరావుగారు, శోభనాద్రిగూడెం.
22. పెడవల్లి శంకరసోమయాజిగారు, నందిగామ.
23. ధూపాటి తిరుమల వేంకటరమణాచార్యులుగారు, శతావధాని, గంపలగూడెము.
24. చావలి పిచ్చయ్యగారు నేటీవుడాక్టరు, కడవకొల్లు.
25. ఇందుర్తి రంగారావుగారు పోలీసుసబ్ యినస్పెక్టరు దుగ్గి.
26. చింతపల్లి చలమయ్యగారు కరణం, మేళ్లవాగు.
27. ధారా వెంకటసుబ్బయ్యగారు లాకుసూపరెంటు, కరేడు.
28. పురాణం కొండమాచార్యులుగారు, మూలపేట.
29. వెలిదెండ్ల సుబ్బారావుగారు, దాచేపల్లి.
30. చిమ్మపూడి గురునాథంగారు, పటేలు, అడ్లూరు.
31. రాళ్ళభండి రాజయ్యగారు విలేజిమునసబ్, చింతిరాల.
32. అన్నంరాజు సుందరామయ్యగారు, యర్రగుంటపాలెం.
33. ఓబర్సు శేషగిరిరావుగారు, కరణం, వెలంపల్లి.
34. శంకరమంచి అన్నయ్యశాస్త్రిగారు, చినవోగిరాల.

# అభినవసరస్వతి.

పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి

ఇదియొకమాసపత్రిక - ఇందు ప్రాచీనవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును బ్రకటింపబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలికవ్యాసములకవకాశములగు నానందముగాక చందాదారులకు సంచిక 2-3 అపూర్వగ్రంథములలవడును. చందా సం 1కి, రు 2-0-0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 అప్పయాచార్యవిజయము | | ... | ... | 0-4-0 |
| 2 కంఠీకోద్ధారిణి (పూరెవీరభద్రకవి) | | ... | ... | 0-4-0 |
| 3 వాసంతికా పరిణయము } ఇవి రెండు నాటకములు. | | | ... | 0-4-0 |
| 4 కంసవధము | | | ... | 0-8-0 |
| 5 చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | | ... | 0-4-0 |
| 6 విరూపాక్ష పీఠగురుపరంపర | | ... | ... | 0-2-0 |
| 7 నీతిగీతులు (సుమతి శతకమునకు సంస్కృతము) | | | ... | 0-2-0 |
| 8 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | | ... | 0-2-0 |
| 9 [illegible]ధనఖండనఖండనము | | ... | ... | 0-4-0 |
| 10 [illegible] తీర్పువిమర్శనము (పత్రికాధిపతి) | | | ... | 0-4-0 |
| 11 సంగదోషము | | ... | ... | 0-8-0 |
| 12 వీరభాగవతము (ముదిగొండవీరభద్రకవి) | | ... | ... | 1-4-0 |
| 13 పుళిందావివాహము (పత్రికాధిపతి) | | ... | ... | 0-4-0 |
| 14 గురుగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, శిష్టపేషణము | | | ... | 0-4-0 |
| 15 శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | | ... | ... | 0-4-0 |
| 16 లక్ష్మీవిలాసము (రాయసము వెంకటపతి) | | ... | ... | 0-4-0 |
| 17 నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | | ... | 0-8-0 |
| 18 పశ్యాంపుశ్యాం | " | ... | ... | 0-2-0 |
| 19 పశ్యశబ్దవిచారము | " | ... | ... | 0-2-0 |
| 20 పురశ్చరణము | " | ... | ... | 0-2-0 |
| 21 అత్యద్భుతవిమర్శనము, (ఇది వెంకటరామకృష్ణకవుల అవధానముల పైవిమర్శనము) | ... | ... | ... | 0-5-0 |
| 22 శంతనురాజచరిత్ర | ... | ... | ... | 0-14-0 |
| 23 రజస్వలావివాహఖండనము | ... | ... | ... | 0-8-0 |
| 24 కన్యావిక్రయము | ... | ... | ... | 0-8-0 |

అభినవసరస్వతీ కార్యస్థానము

జానపాడు-పిడుగురాళ్ళపోష్టు, గుంటూరు జిల్లా.